# వారణాసి శ్రీ రామ కృష్ణ కధలు

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి -కథలు



# 1 . పలాయనం  చేసిన కుక్క   20-12-22

మూర్తి గారి ఇంట్లో ఒక కుక్క వున్నది . అదిఎట్లాగో ఇంట్లో వాళ్లందరికీ మస్కా కొట్టి, గొలుసు తెంచుకొని , గోడదూకి మరీ , పలు మార్లు  పలాయనం చేస్తూ ఉండేది. నిద్దర లేస్తూనే దాని ముఖం చూడకపోతే ఆ రోజు అంత అరిష్టమేనని కుటుంబ సభ్యులందరిలోను  గట్టి నమ్మకం ఉన్నందున - మూర్తిగారు - వారిని వీరిని బ్రతిమాలి - బండి మీద సందు గొందులు తిరుగుతూ - కుక్క యొక్క ఆచూకీ కనిపెట్టి దాన్ని ఇంటికి పట్టుకు వచ్చేవాడు .

మూర్తి గారు బాగా అలోచించి - ఈ కుక్కకూ మనస్సుంటుంది . మనస్సులో ఏమి పెట్టుకొని ఇది ఇల్లాగా పలాయనం చేస్తోందో ? అని అలోచించి - కుక్కలకు  వైద్యం చేసే ఒక డాక్టర్ దెగ్గరికి కుక్కను తీసుకెళ్లితన అభిప్రాయం చెప్పాడు .

ఆ డాక్టర్ " నిజమే నండీ  కుక్కల దెగ్గిర మనస్సుంది  . నా దెగ్గిర ఎక్విప్మెంట్ వుంది "  అని చెప్పి ఒక ఎలక్ట్రోడ్ ని కుక్క మెదడుకు తగిలించాడు . రిజల్ట్స్ అన్నీ,  ఒక ఈసీజీ

గ్రాఫ్ లాగా బయటికి వచ్చాయి . వాటిని చదివి డాక్టర్ ఇలా చెప్పాడు .

మొదటిది - ఆదివారం పూట చికెన్ తెమ్మని మీ ఆవిడ , మట్టన్ వండమని మీరు అన్నాక - ఆవిషయం మీద మీరిద్దరూ పోట్లాడుకున్నాక మీరు బజారుకెళ్లి తోటకూర కట్ట పట్టుకొస్తున్నారుట .మీఇద్దరి మధ్యా మాట సఖ్యత ఎప్పటికి కుదురుతుందా ? ఎప్పుడు బొచ్చెలో నాన్ వెజ్ పడుతుందా అని కుక్క మనస్తాపం చెందుతున్నది . అందువల్ల ఆ వైరాగ్యం భరించలేక ఇది ఆది వారం పూట్ల ఇల్లు వదిలి పలాయనం అవుతున్నది . నిజమే నంటారా ? అని అడిగాడు డాక్టర్ గారు . అవును అన్నాడు మూర్తి గారు .

రెండోది - సెలవలు దొరికినప్పుడు మీ పుట్టిన వూరికి పోవాలని మీరు , ఆమె పుట్టింటికి పోవాలని ఆమె వాదులాడుకుంటారు . మీ వాదులాట ఎంతకీ తెగక - చివరికి తాను ఎక్కడికి పోతానో తెలియక కుక్కకు తిక్క లేస్తున్నది. ఆ తిక్కలో పలాయనం చేస్తున్నది . నిజమేనంటారా ? అన్నాడు డాక్టర్ గారు .

"నిజమే . ఆమె ఒక సందులో , నేనొక గొందిలో దీని కోసం వెతుకుతూ సెలవలు ఖర్చు చేస్తున్నాము "

మూడవది -" మీరు బయటినుండి వచ్చి నప్పుడు మీతో పాటు వేరే ఆడ వాసనలు - వస్తున్నాయట . మీరు మీ భార్యకు ఏమి ద్రోహం చేస్తున్నారో తెలియక - తెలుసుకునే పని మీద ను, రహస్యం ఛేదించాలన్న డిటెక్టివ్ పని మీదనూ ఇది పలాయనం చేస్తున్నది "

" నిజమే నండీ . నేను కావాలని నిండుగా ఆడ పాసెంజర్లు వుండే బస్సులో ప్రయాణం చేస్తూ, కావాలని పోయి లేడీస్ పక్క నో వెనక నో నుంచున్నప్పుడెల్లా కూచున్నపుడెల్లా ఇది పలాయనం చేసిందని గుర్తుకు వస్తున్నది. ఈ పలాయనానికి ముందు నేను నాభార్య మాట్లాడుకుంటూ ఉంటే - నన్ను కరవ వచ్చేది . నేను దిండు దుప్పటి తీసుకుని సోఫాలో పడుకునేదాకా నానా యాగీ చేస్తుండేది . నన్ను బెడ్ రూమ్ లోకి పోనిచ్చేది కాదు "

నాలుగోది - " మీ అమ్మాయి మీకు తెలీకుండా - ఈ కుక్క ఆడదో మొగాడో కూడా తెలుసుకోకుండా దీనికి చెవులు కుట్టించి -తాను వాడి వదిలేసినా లోలోకులు , బుట్టలు , రింగులు, జుంకాలూ - తగిలించి అలంకరించాలని - కాలి వేళ్ళకు మెట్టెలు పెట్టాలని - ఫ్రెండ్స్ తో కలిసి పథకాలు

పన్నుతున్నది . కుక్కకు చెవులు కుట్టే వారి కోసం ఇంటర్నెట్ అంతా వెతుకుతున్నారు . ఎవరూ దొరక్కపోతే మనమే చెవులు కుట్టేద్దాం . బుట్టలు తగిలిద్దాం అని నిర్ణయాలు కూడా తీసుకుంటున్నారు . అప్పుడు దీనికి జీవితం మీద విరక్తి కలిగి పలాయనం అవుతున్నది "

" ఇదీ నిజమే నండీ . అమ్మాయి తన స్నేహితులతో గుసగుసగా ముచ్చట్లాడుతున్న సమయంలో ఇది చెవులు రిక్కించి వింటుంది . తోకని ,తలని నేల కేసి ఠపీ ఠపీ మని బాదుకుంటుంది - ఆ తరువాత ఒక రోజులోపలే మా కళ్ళు కప్పి పలాయనం అవుతుంది "అని అన్నాడు మూర్తిగారు .

—-----------------------------------------------------------

## 2. రానూ పోనూ  ఖర్చుల క్రింద .. 26-12-22

పని మనిషి పద్మ అని ఉంటది . మీరు - హై కోర్ట్ సీనియర్ లాయర్ జగన్నాధం గారి ఇంటికి వెళ్ళినప్పుడు ఆమెను తప్పని సరిగా చూసేవుంటారు . లాయర్ గారితో మీరు మాట్లాడుతూ ఉన్నప్పుడు కాఫీలు ఆట్టుకొచ్చేది పద్మనే . చూపులకు ఎంతో అందంగా - సూర్యుడికి  గూడ  వేడి పుట్టించెట్లు ఉంటది .ఈ పద్మ అన్నీ తానై ఇంటిలో కలిసిపోయి   పనులు చూసుకుంటూ ఉంటుంది .

పైన చెప్పిన పద్మను,  వాళ్ళ పిన్నమ్మ పిచ్చెమ్మ వచ్చి పలకరించి " "కొత్తగా బ్యాంకూ వుద్యోగం  అయన వచ్చాడు . పనిమనిషి కావాలంటా. నువు వారింటి పని చేస్తావా . నెలకు మూడు వేలు . పొద్దునా గంట సాయంత్రం ఓ గంట పని అంతే . వాళ్లకు పిల్లలు కూడా లేరు " అని ఊరించి చెప్పింది.

" ఆ పని నాకెందుకే పిన్నమ్మా .. . వస్తున్నది చాలనిపిస్తా వుంది " అనింది పద్మ .

" ఇంటావుంటే ఎనికేదో పెద్ద సంగతే ఉన్నట్లుంది .  ఏంటే అది ? " అని అడిగింది పిన్నమ్మ

"ఏంటీ లేదు . ఈ మధ్య ఇంటికి కోడలు గారు వచ్చింది . ఆ అమ్మ కిచెన్లోకి వచ్చి ఉదయం ఆరు కాఫీలు సాయంత్రం నాలుగు కాఫీలు చిక్కంగా కలుపుకొని తాగుతుంది . ఖరీదైన నెస్కేఫ్ పొడి ఖర్చు అయిపోతాఉందని మా అమ్మగారునీలుక్కొని ,  నన్ను పిలిచి " ఇదిగో - ఈ కాఫీపొడి సీసా తీసుకెళ్లి - కోడలికి కనపడకుండా ఎక్కడన్నా దాచు" అంటుంది .

కోడలమ్మగారు వెళ్లలేని గది ఆమె మామగారి గదే కదా ?
పైగా లాయర్ గారు కూడా - చివరికి అమ్మగారిని కూడా
తనఆఫీసు గదిలోనికి రానివ్వడు–ఆయన ఆలోచన లు
దెబ్బతింటాయని . ఆయన కోప్పడతాడని ఈమెకూడా
ఆఫీస్ గదిలోకి పోటానికి డడుస్తది . అందుకని నేను కాఫీ
పొడి తీసుకెళ్లి అక్కడ పుస్తకాల బీరువాలు వెనుక .
దాస్తాను . కొంసేపటికి - కోడలమ్మ గారు కిచెన్ లోకి వచ్చి
" పద్మా - ఆ కాఫీ పొడి ఎక్కడుందో కనపడి చావటం లేదు
.మా అత్తా ఎక్కడ దాపెట్టిందో చూడు " అని ఆర్డర్ వేస్తుంది
. మరి చిన్నమ్మ గారి మాట కూడా వినక తప్పదు గదా ?
అందుకని నేను మళ్ళా అయ్యగారి గదిలోకి వెళ్లి కాఫీ సీసా
పట్టుకొస్తాను . బీరువాల వెనుకాతల సీసా దాపెట్టేదీ నేనే,
వెతికి వెతికి పట్టుకొచ్చేది నేనే .. భలేవుంది గదూ నాపని
. కోడలుకు కనపడకుండా సీసా దాపెట్టినందుకు
అమ్మగారు నాకు ఇనాంలు ఇస్తుంటుంది . అత్తగాఋ
దాపెట్టిన సీసా వెతికి తెప్పించుకుని తానూ పై చేయి
సాధించించి నందుకు సంతోషించి కోడలమ్మ గారు ,
అత్తగారు కొనిపెట్టినవి అయినందున ఆమెకు నచ్చని కొత్త
చీరా రవికలు నాకు ఇస్తుంటుంది . ఇదంతా ఒకెత్తు
మిగతాది మరోఎత్తు పిన్నమ్మా " అని కిలకిలా నవ్వింది
పద్మ.

"ఏంటే అది?" అని అడిగింది పిన్నమ్మ

' అదేంటంటే .. గదిలోకి వచ్చి పోతున్నందుకు, రానూ పోనూ ఖర్చులకోసమని అయ్యగారు నెలకి నలభై వేలు నా చేతిలో పెడుతుంటారు '

పిచ్చెమ్మ పిన్నమ్మ జుట్టు పీక్కుంది .అర్ధమయినాక కొంత . అర్ధం కాకా కొంత.

—-------------------------------------------------------

## 3 కాంతము - చింత కాయలు పచ్చడి 17-1-23

మునిమాణిక్యం వారి కాంతము అనే మా అప్ప గారిని అంటే తెలియని ఆంధ్రుడు వుండడు అనే నమ్మకం తో ఈ కథ.

మా కాంతం అప్పగారి పెనిమిటి అయినా మన మాస్టారు గారు పిల్లలని పోగేసి వారికి లెక్కలు నేర్పుతున్నాడు . తెలుగు కూడా నేర్పుతాడు లెండి .

ఆయన పిల్ల వాళ్ళ ని ఉద్దేశించి " ఒరేయ్ పిల్లలూ మిమ్ము చింత చెట్టు ఎక్కి నిముషానికి ఒక కాయ చొప్పున తినమని అన్నాను అనుకోండి . అప్పుడు మీరు ఉదయం నుండి సాయంత్రం లోపు ఎన్ని కాయలు తింటాబు ? అని

ప్రశ్నించాడు . ఈ రకంగా పిల్లలు లెక్కలు నేర్చుకోవటం సులువు అని ,వారికి చిరుతిళ్లు మీదను ఆసక్తి పెరిగినట్లే లెక్కలంటేను ఆసక్తి పరుగుతుందని , అదీ కాక లెక్కలు నేర్పటంలో తనది విన్నూ తన పోకడ అని మాస్టారుగారి ఫీలింగ్ .

ఈ లెక్క ద్వారా పిల్లలు - రోజుకు ఎన్ని గంటలు వున్నవి ? అందులో సగము పగలు అనుకుంటే అందులో ఎన్ని గంటలు వున్నవి ? గంటకుఅరవై నిముషాలు అని పిల్లలకు గుర్తున్నదా ? లేదా ? పగలు= 12 గంటలు ఇంటూ 60 నిమిషాలు ఇంటూ నిమిషానికి ఒక చింతకాయ = అనేది సమాధానం అవుతుందని, దీనిని పిల్లలు కనిపెట్ట కలుగుతారో లేదో చూతాము - అనేది పంతులుగారి ఉద్దేశ్యము .

పిల్లలన్నాక అందులో కొద్దీ మంది కొంటె పిల్లలు కూడా వుండకపోరు . వారెవరన్న " మల మూత్రాలకు కిందకు దిగవచ్చా ? అక్కడినుండి కానివ్వలా ? అప్పుడు మాకు నీళ్లు ఎవరిస్తారు ? ఆకులు వాడుకోవాలా ? ఇక మాకు అన్నము నీళ్లు ఎవరిస్తారు ? మా అమ్మలా ? మీ అమ్మలా ? అని అడుగుతారని , కిందకు దిగవచ్చునంటే ఆ టైం లో చింతకాయలు ఎన్ని తగ్గిస్తాఋ ? అనే ప్రశ్నలు

అడుగుతారని - అల్లా అడిగిన పిల్ల వాడి వీపు వాయ కొట్టాలని మాష్టారు గారు తలపోస్తూ వున్నారు .

బొళ్లు అంటే అంట్లు తోముకుంటున్న మా కాంతం అక్క ఈ లెక్కంతా విని , పవిట బొడ్లోకి చెక్కుకొని , భర్తగారి దెగ్గరికి వచ్చి , లెక్కతో జోక్యం కలిగించుకుంది. " ఏమిటండీ , ఏమిటీ ఈ విపరీతం . పిల్లలని అందరిని పెరటిలోని చింత చెట్టు ఎక్కించి కాయలు తినిపిస్తారు ఏమిటి ? కోస్తే గంపెడు కాయలు అవుతవి . కమ్మగా చింతకాయ పెట్టుకోవచ్చు . వచ్చే పురుళ్లలో వాడుకో వచ్చు అనుకుంటూ వున్నాము . మీరెంత మాస్టారు గారైనా పిల్ల వాళ్ళు చెట్టు ఎక్కి నిమిషానికి ఒక కాయ తినమంటే తింటారా ? తినరూ . తినలేబు . మీది ఎంత పనికి మాలిన లెక్కోమీకు తెలుసునా ? రెండుకాయలు తిన్నాక పిల్లలు పళ్ళు పులుపెక్కి మరి ఇంకో కాయ తినలేరు .లెక్కకొసమని , కాదూకూడదని , మీరు బలవంతాన వాళ్ళకి ఇంకో నాలుగు కాయలు తినిపించారో అంటే వాళ్ళ అమ్మలు అమ్మమ్మలు వచ్చి మావాడికి జలుబు దగ్గు తెప్పించారని మీమీదను నేరాన్ని ఆరోపించి మిమ్మల్ని దంచి పోతారు .

ఇదంతా మీకు ఎందుకొచ్చింది కానీ - ఆ సన్నగా చురుగా కనపడుతున్న పిల్లాడిని చెట్టుఎక్కి కాయలు రాల్పమనండి

- మిగతా పిల్లలని కిందనిలబడి దుప్పటి పట్టుకో మనండీ. లెక్కలు అని పేరుపెట్టి పిల్లల చేత పూరాగా ప్రయోజనం లేని ఎదో ఒక పని చేయించటమేనా మీ తెలివి ? అయ్యో . చూలాలు ఐన పెళ్ళాం పచ్చడి నూరుకో ని తింటుంది . దానికి ఇన్ని చింతకాయలు దులిపించాలన్న తెలివి లేని మాస్టారు గారు మీరూ ఓ మాష్టారేనా ? అని దులిపివేసింది .

అప్పుడు ముని మాణిక్యం గారు గృహస్థ ఆశ్రమానికి నిర్దేశింప బడిన నవ్వు ఒక్కటి నవ్వి
" డియర్ కాంతము . నువ్వు అనిన ఆ సన్నని చురుకు పిల్లవాడు మన మునుసుబుగారి మనమడు . వాడిని చెట్టు ఎక్కించామని తెలిస్తే వాళ్లొచ్చి నా వీపు చింతకాయ పచ్చడి పెడతారు . రేపు మీతమ్ముడు హనుమంతు వస్తాడు కదా ? వాడిని చెట్టెక్కిద్దాము . నువ్వూ నేను క్రింద నిలబడి దుప్పటి పట్టుకుంటాము " ఈ రకంగా లెక్క ముగుస్తుంది . సరేనా ?? అన్నాడు మా కాంతంఅప్ప గారి పెనిమిటి .

"ఒరేయి చింత చెట్లు ఎక్కవద్దురా . ఇలాగే చాలా చిక్కులు వస్తవి , సరేనా ? అని మాణిక్యం మాస్టారుగారు పిల్లలని అడిగారు . "సరే సార్ " అంటూ పిల్లలు ఇళ్లకు పరిగెత్తారు .

మా అప్పగారిది పైచేయి అయినపుడు ఆరోజుకు మాస్టారు డీలా పడి పోయి మరి పాఠం చెప్పరు అని వారికి అనుభవం నేర్పిన పాఠం .
—-------------------------------------------------------------

## 4- మా వీధి కట్టుబాటు 13-1-23

మా వీధిపేరు తిరు వీధి. మా వీధులకు తిరువీధులు అని పేరు ఎలాగంటే -? ఒక రియల్ ఎస్టేట్ ఆయన ఒక కాలనీ కట్టి అయన భార్య అయిన తిమ్మాపురం రుక్మిణమ్మ పేరును ఆ కాలనీకి పెట్టి వీధులకు తిరువీధి ఒకటి తిరువీధి రెండు అని బోర్డులు రాయించాడు . ఈ మా వీధిలో లోని ఒక ఇల్లు అద్దెకు తీసుకొని కొత్తగా కాపురం పెట్టాడు కరుణాకరమ్. ఇతనికి ఆఫీస్ కొలీగ్ ఐన ఎకానమీ సాంబమూర్తి అనే ఆయన కూడా ఇదే వీధిలో ఉంటాడు . సాంబమూర్తి ఎకానమీ చేయటంలో ఎక్స్పర్ట్ .నాకు చిన్నప్పటి ఫ్రెండ్ . అందుకని మొఖమాటం లేకుండా నా ఎదురనె భార్యతో ఇట్లా వాదిస్తున్నాడు .

"ఆ కరుణాకరన్ వాళ్ళు  ఫంక్షన్  అని పిలిచారే అనుకో ? మనము వెళ్ల వలసిందేనా ? వెళ్ళామంటే మొహమాటానికైనా ఒక వెయ్యి రూపాయ ల గిఫ్ట్ చేతిలో పెట్టి రావాలి .ఎందుకంటే అతడిది నా కన్నా పవర్ ఫుల్ సీటు . పై ఆఫీసర్లతో పలుకుబడి ఎక్కువ .ఫంక్షన్ కి వెళ్లి ఈ ఖర్చు పడటం మనకు అవసరమా ?ముందు ఫంక్షన్ ఎగ్గొట్టి తరువాత ఎదో కుంటి సాకు చెప్పొచ్చు " అని

అప్పుడు , మావాడి భార్య ఇట్లా అన్నది                " వాళ్ళు పిలిచింది వాళ్ళ పిల్లాడి మొదటి పుట్టిన రోజు ఫంక్షన్కు రాత్రి భోజనాలకి రండి అని . డిన్నర్ కోసమని , చికెన్ , ఫిష్, ప్రాన్స్ , మట్టన్ వంటివి దండిగా వండిస్తున్నారని - వంటకు పది మందిని రప్పించారని - మన పనిమనిషి చెప్పింది . ఇందాకనుండి మంచి మసాలా నూరిన ఘుమ ఘుమ వాసనలు కూడా వస్తున్నాయి . ఎకానమీ లో పడి మనము ఎన్నాళ్లని తోట కూర , చారు నీళ్లతో గడపటం ? ఇట్లాంటివే మనకడుపుకు పండగ . వెళ్లి హాయిగా కడుపునిండా మొహమాట పడకుండా తిని వొద్దము. సాయంత్రం ఆఫీస్ నుండి పెందరాడే రాండి. ఆలస్యంగా పోతే అన్నీ అందుతాయో లేదో " .అన్నది

" నూ చెప్తూ ఉంటే నోరు ఊరుతూనే ఉందికాని -గిఫ్ట్ ఖర్చు సంగతేమిటి ? . ఏదైనా గిఫ్ట్ ఇవ్వక పోతే బాగోదు. ఆఫీసులో పేరువస్తుంది . మరి డబ్బులు నీ బాబు ఇస్తాడా ? అని దుడుకు స్వరంతో అడిగాడు సాంబమూర్తి .నేను వున్నాను వింటున్నాను అనే బెరుకు లేకుండా .

" అబ్బ చెప్పేది పూర్తిగా వినండి . మన వీధి కట్టుబాటు ఏమిటో మీకు తెలిసినట్లు లేదు . ఈ వీధి కట్టుబాటు ప్రకారం. పుట్టిన రోజు ఫంక్షన్ లకి వెళ్లిన ప్రతి ఒక్కరూ నాలుగు రంగు బెలూన్లు కొని– ఊది వాటికి దారాలు కట్టి పిల్లాడి చేతిలో పెడతారు.అంతకన్నా ఎక్కువగా ఎవరూ ఏ గిఫ్టూ ఇవ్వరు . ఇవ్వరాదు . ఇచ్చిన వారికి పంపు దెగ్గర మంచినీళ్లు దొరకనివ్వరు . మన వీధి వాళ్ళందరూ ఇలాగే చేస్తారు కాబట్టి మనమూ అల్లాగే చేస్తాము - ప్రత్యేకించి మనల్ని తప్పు పట్టేదానికి ఇందులో ఏమీ లేదు .ఈ వాడ కట్టు నిర్ణయాన్ని తప్పు పట్టను ఆయనకు మాత్రం ఎంత ధైర్యం ఉండాలి ? పంపు దగ్గర మంచి నీళ్లు పుట్టనిస్తామా ? అయన అంటే ఎదో ఈ తిరువీధుల వీధి కట్టుబాటుతెలిసో తెలీకో ఇంత పెద్ద ఎత్తున పిల్లాడి పుట్టిన రోజు ఫంక్షన్ పెట్టుకున్నాడు .ఇప్పుడు మనకి మొత్తం మీద నాలుగు బెలూనల్కుగాను అని ఫది రూపాయకు మించి ఖర్చు

కాదు. మీరు కాదూ కూడదంటే రెండు బెలూన్లతో సరి పెడదాము " అన్నది ఎకానమీ సాంబమూర్తి భార్య.

" మన వీధి ఇంత మంచి వీధి అని , ఈ వీధిలో ఇంతటి మహత్యం వున్నదని నాకు తెలీదు .. మధ్యాన్నానికి ఏమీ వండకు. పొట్ట ఖాళీగా వుంచుకుందాం " అన్నాడు ఎకానమీ సాంబమూర్తి.

—------------------------------------------------------------

## 5 <u>అప్సర బ్రాండ్ అరిసెలు ..11-1-23</u>

" ఓర్నీ అని సంగ్రాత్రి పండగ వచ్చేస్తొంది గాదా? " అనికొని గంగాళం రంగారావు తన వ్యాపారాన్ని అరిసెల వైపు తిప్పాడు . రంగారావు గంగాళంలా లావుగా ఉంటాడు . అందుకని ఊరి ప్రజా అతడిని ముద్దుగా గంగాళం రంగారావు అంటారు . అతడు ఇంటిలో నే రకరకాలైన కార , తీపి పిండివంటలు. ముఖ్యంగా పిల్లలు బళ్ళ దెగ్గర ఎగబడి

కొనుక్కునే చిరుతిండి పిండివంటలు వండించి, వాటిని టోకున కోట్లకు వేస్తుంటాడు .

ప్రతొక్కరికీ షుగర్ వున్నా ఈ రోజుల్లో , అసలు అరిసెలకు డిమాండ్ వుడా లేదా ఉంటే ఎల్లాగ్గా ఉందొ చూద్దారి అనికొని, ఒక సర్వే లాగా " మీరు అమ్ముకోటానికి అరిసెలు కావాలంటే ఆర్డర్ పురమాయించండి " అంటూ కొట్ల చుట్టూ తిరిగి ఆర్డర్ తీసుకోసాగాడు గంగాళం .

పెద్దగా జనసంచారం లేని ఒక మారు మూల వీధి షాప్ నుండి నాలుగు వేల అరిసెలు కి ఆర్డర్ ఇచ్చింది ఓ కుర్ర పిల్ల .అప్పుడు రంగారావు "ఈ షాపీ ఏట్టిన ఈ కుర్రపిల్లకి అనుభవం తక్కువనాగుంది " అని మొదటగా ఆశర్య పోయి- , సరుకుకు కావాల్సిన అడ్వాన్స్ తనకు ముట్టిందని గమ్మునుండి పోయాడు .

పై తర్వాతా, రంగారావు వూళ్ళో కూడా తిరిగి ఇంకాకూడా ఆర్డర్లు ,ఎడ్వాన్సులు తీసుకున్నాడు .

వారం తరువాత అతడు వచ్చి నపుడు వీధి షాప్ నుండి మరో నాలుగు వేల అరిసెలు కి ఇంకో ఆర్డర్ వచ్చింది. ఊరి

లో ఉన్న షాపులనుండి మాత్రం ఆర్డర్లు రాలేదు . పైగా సరుకు వాపాసు ఇచ్చేట్లు కనపడ్డారు .

అప్పుడు గంగాళం రంగారావు ఆలోచనలో పడి - "ఇప్పడి వరకు ఎనిమిది వేల అరిసెలు పుచ్చుకున్న ఆ వీధి షాప్ కి వెళ్లి - ఈ పండగ లోగ ఇంకా ఎంత ఆర్డర్ ఇస్తుందో అంచనా అడిగాడు .

వీధి షాప్ నడుపుతున్న కుర్ర పిల్ల నిక్ నేము జేజమ్మ .ఎర్రగా బుర్రగా వున్నా ఆ పిల్ల ఎవరిని చూసి నవ్వుతుందో, ఎవరిని చూసి కన్ను గీటుతుందో , ఎవరిని చూసి పైట జారుస్తూ ఉంటుందో వూహించటానికి వీలు కాకపోవటం వల్ల, వాళ్ల జేజమ్మ వల్ల కూడాకాదని ఆలోచనతో , ఊరి కుర్రకారెల్లా కలిసి ఆ పిల్లకి జేజమ్మ అని పేరెట్టుకున్నారు .

ఊరి కుర్రలందరూ అమెకొట్లోనే బఠాణీలు కొని సుఖ కాలక్షేపంచేస్తూ అక్కడక్కడే తిరుగు తుంటారు . జేజమ్మ సంకురేతిరికి అరిసెల వ్యాపారం ఎట్టాలి అనుకోని తన పేరు అప్సరగా మార్చుకొని -ఆన్లైన్ లో అమెజాన్ ద్వారా అరిశెలను అమ్మే బిజినెస్ ఆరంభించింది .
యాపారం ఎట్టగానే సరికాదు కదా? ప్రచారం ఉండాలిగా ? అనుకోని ప్రచారానికి గాను కొత్త పద్ధతి ఎంచుకొంది .

మంగమ్మ గారి మనుమడి సినిమాలో వుండే " దంచవే మేనత్తా కూతురా .." అనే పాటకు పోకిరీ పిల్ల స్టెప్స్ వేస్తూవందలాది గా ఫోటోలు దిగింది . చీర లేదా లంగా మోకాళ్ళ పైకి లాగి , కుచ్చెళ్ళు బొడ్లో దూర్చి . రూపాయ బిళ్ళంత బొడ్డును బహిర్గతం చేస్తూ . పవిటను రొండు కొండల మధ్య జలపాతంగా పరిగెత్తనిచ్చింది . ఈ చీరా పైటలతోనే పిండి దంచుతున్నట్లు . పిండి జల్లిస్తున్నట్లు , గాడి .పొయ్యి వెలిగించి అరిసెల పాకంపట్టుతున్నట్లు . కష్టపడి అరిసెలు వత్తుతున్నట్లు. వండుతున్నట్లు , ఈ కష్టంతో వంటిమీద చెమటలు పట్టి జాకిట్టు తడిసినట్లు . ముక్కు మీదనుండీ చెమట బొట్టు కారుతున్నట్లు , చూపిస్తూనూ , ఇహనూ ఇలాటీపె ఇంకా అనేక యాంగిల్సులో ఫోటోలు దిగింది అప్సర . నిజంగా ఆమె వండిన అరిసె ఒక్కటీలేదు . కానీ వండుతున్నట్లు నటిస్తూ , .ఆ వండటంలో ఎంత శృంగార రసాన్ని ఒలక పోయచ్చో అంతా ఒలకపోసి , వందలాది రకాల ఫోటోలు దిగింది

రకరకాలగా చీరలు జాకెట్లు మారుస్తూ కట్టి , జుట్టు చెరుపుకుంటూ , వేరు వేరు భంగిమల్లో , మరీ ముఖ్యంగా పిండి దంచుతూ , పిండి జల్లిస్తూ వందలాది గా ఫోటోలు దిగింది . వాటిని వేలాదిగా కాపీలు వేయించింది . "మా దెగ్గిర

మినిమం పది అరిసెలు ఆర్డరు ఇచ్చిన వారికి నా పెర్సనల్ ఫోటో ఒకటి ఫ్రీ .ఒకసారి వచ్చిన ఫోటో మరో సారి మీకురాదనీ నాదీ పూచీ . ఆంధ్రులారా అప్సరా బ్రాండ్ అరిసెలే కావాలని అడగండి. అడిగించండి . ఆరగించండి అనుభవించండి " అని నెట్ లోఒక యాడ్ ఇచ్చింది .

నడుము వంపులతో , పొట్ట మీద చెమట చుక్కలతో , గుండె బలం , జబ్బబలం, పిక్కల బలం చూపిస్తూ అరిసెల పిండి దంపుతున్న అప్సర ఫోటోలు యూత్ లో వైరల్ అయ్యాయి. ఇది కాక అప్సర మోకాళ్ళ దాకా చీర లాక్కుంది అనుకున్నాము కదా ? ఆపై మోకాలి చిప్పపై లవ్ సింబాల్స్ వేయించుకొని - ఒకదానిపై "వెల్" అని ఇంకో దానిపై " కమ్ " అని రాపిచ్చుకుంది . .ఈ ఫోటో జేబీలో లేని వాడు మొగపురుషుడు కాదు అన్నట్లు అయ్యింది

ఆంధ్రా యూత్ కి .ఈ ఫోటో ఏ ఆర్డర్ తో వస్తుందో దేముడికి కూడా తెలీదు . కంప్యూటర్లు నిర్ణయిస్తాయన్న మాట .

.

గంగాళం రంగరాజునుండి - ఐదు రూపాయలకు కొన్న అరిసెకి తన ఫోటోని జతకలిపి , ఒక పీసు ఇరవై రూపాయలకులేదా అరడజను రెండు వందలకు అమ్మిన -

అప్సర , వారం రోజుల్లోనే అరవై వేలకు పైగా సంపాదించింది . ఖర్చులన్నీ పోగానేను .

గంగాళం రంగరాజు వచ్చి ఆర్డర్ అడిగి నప్పుడు " ఓ లక్ష అరెసెలంటే మనవల్ల అవుద్దా ?? చెప్పు " అని డిమాండ్ చేసింది - . అప్సరా బ్రా0డు అరిసెల ఓనరు.

నీతి - అమ్ముకోవటానికి సరుకు కాదు - స్కీం ఉండాలి - మనకంటూ ఓ బుర్రవుండాలి. .

BY VARANASI SREE RAMA KRISHNA

## 6 బడి టూ గుడి 3-01-23

జపాన్ దేశము యొక్క స్వభావము- వారి ఉన్నతికి గల మూల కారణమూ తెలుపు నిజ సంఘటన . దీనినుండి మనముకూడా గ్రహించవల్సింది ఎంతో వున్నది అనుకుంటాను .

1832 ప్రాంతంలో జపానులో ట్రావెలింగ్ టీచర్స్ అనేవారు ఉండేవారు . వీరు దేశసంచారం చేస్తూ .. ఆయా

ప్రాంతాలలో దొరికే గ్రంధాలను పఠిస్తూఉండేవారు .--దానితో పాటు బ్రతకటం కోసం అని, ఆయా ప్రాంత ప్రజలు అనుసరిస్తున్న తెలివైన వ్యవసాయ పద్ధతులు , కట్టడాల నిర్మాణ రీతులను, ప్రకృతిని కాపాడుతూనే ప్రకృతిని జయించి మచ్చిక చేసుకుంటున్న తీరును , బట్టలు పింగాణీ , ఇనుము వంటి సామాగ్రి తయారీ మెళుకువలు పరిశీలిస్తూ -అంటే ఇలాంటి విజ్ఞనాన్ని క్షేత్ర స్థాయినుండి స్వీకరిస్తూ , వూరు– వూరికి తిరుగుతుండేవారు ఈ ట్రావెలింగ్ టీచర్స్ . వీరు పగలు తమ పరిశీలన జరిపి - జ్ఞ్యానం సముపార్జించి - రాత్రి వేళ ఆ ఊరి ప్రజల కోసం ఉచిత బడులు నిర్వహించి - తాము ఇంతకు ముందు వేరే ప్రాంతాల నుండి తెలుసుకొని వచ్చిన విషయాలను ఈ ప్రాంత ప్రజలకు భోదించే వారు .ఈ రకంగా ఎక్కడో , ఎవరికో జన్మించిన తెలివిని దేశప్రజలందిరి దృష్టికి తెచ్చి - ప్రతి ఒక్కరు ఆ విజ్ఞ్యానము వల్ల లబ్ధి పొందేందుకు దోహదపడేవారు

ఉదాహరణకి -ఆహారాన్ని ఎలా నిల్వ ఉంచుకోవాలి .. బట్టలు సున్నింతంగా ఎలా నేయవచ్చు, వంటి విషయాలు స్త్రీలకూ , వ్యవసాయ మెళుకువలు , భవన నిర్మాణ మెళుకువలు పురుషులకు నేపుతుండేవారు .

భవన నిర్మాణం అంటే లెక్కలతో పని . ఈ లెక్కలు నేర్చుకొని - రాజప్రాసాదాలు , కోటలు , మందిరాలు , వంతెనలు రోడ్లు వంటివి కళాత్మకంగా నిర్మించే వారికి - ఎంతో ఎక్కువ పారితోషికంతో పని- మరియు గొప్ప ఖ్యాతి, గౌరవం లభించేవి .

పైన చెప్పుకున్నటువంటి ట్రావెలింగ్ టీచర్లు - ఊరిలోకి వస్తూనే భవన నిర్మాణానికి చెందినది లేదా మరొకదానికి చెందిన సమస్యను ఒక లెక్క రూపంలో ఒక చెక్క పలక మీద రాసి - ఆ ఊరి గుడి ద్వారానికి వేలాడ కట్టి అక్కడనే కూర్చుండేవారు . ఊరి వారు వచ్చి ఆ లెక్కను చూసి - తగిన సమాధానం చెప్పినట్లు అయితే .,,, ఈ ట్రావెలింగ్ టీచర్ గారు " ఈవూరికి నేను నేర్పటం కాదు - ఈ ఊరినుండి నేను నేర్చుకోవాలి " అని అనుకోని అక్కడ విద్యాభ్యాసం చేసేవాడు - చివరికి పామరులనుండి అయినా సరే .

ఊరి ప్రజలు లెక్కను అందులోని సమస్యను పరిష్కరించలేనపుడు - వారు " మీరు మావూరిలో బస చేసి మాకు జ్ఞ్యానం భోదించి వెళ్ళండి " అని కోరేవారు . అంతే కాక ఆయనకు ఉచిత వసతి ఆహారం ఇచ్చి

ఆదరించి - ఒక బడి ఏర్పరిచి తమకు కావాల్సిన విషయాలను ఆయనను అడిగి నేర్చుకునే వారు .

ఒక సారి "యాషీ షిరూ "అనే గురువు గారు ఒకవూరు వచ్చి పైన చెప్పిన విధానా, వూరిలో ప్రజలకు విద్య భోదిస్తూ వున్నాడు . ఈయన లెక్కలు చెప్పి - వాటికి ప్రతీఒక్కరు సులువుగా ఎలా సమాధానాలు సాధించవచ్చో ఎంతో సరళ రీతిలో భోదిస్తూ వుండే వాడు . . ఈయన భోదనా రీతికి మెచ్చి - పొలం పనులు చేసుకునే రైతులు వంటి వారు కూడా ఈయన విద్యార్థులుగా మారారు .దీని వల్ల ఈయన ఖ్యాతి ఆ ప్రాంతం అంతా పాకింది .

యాషీ షిరూ కీర్తి ఈ రకంగా వ్యాప్తి చెందటం - అదేప్రాంతం లో వేరే వూరిలో వున్నా మరో గురువు అయినా "యామశాకే" అను గురువు గారికి కంటగింపు అయ్యింది . కారణం క్రమంగా అయన శిష్య గణమంతా "యాషీ షిరూ కి" శిషులు గా మారటం .

అప్పుడు యామశాకే వచ్చి యాషీ షిరూ కి ఒక కఠినమైన లెక్క ఇచ్చి " ఇది పరిష్కరించ లేక పోతే ఈ రాత్రికే వూరు ఖాళీ చేసి వెళ్లి పోవాలి " అని చెపుతాడు . అలాగే యాషీ షిరూ తనకు ఒక లెక్క ఇవ్వాలని - తాను దాన్ని పరిష్కరించలేకపోతే - తానూ ఈ ప్రాంతం విడిచి వెళ్లి పోతానని పందెం వేస్తాడు . ఒక వేలు మందము, జానా

పొడుగు వున్నా కొవ్వొత్తి ఎంతసేపు వెలుగు తుందో అంతలోపు ఆ సమస్యను పరిష్కరించాలని నియమము .

యాషీ షిరూ తనకు ఇవ్వబడ్డ లెక్కను పరిష్కరించలేక - తలలోనుండి చెమటలు కక్కుతాడు .యామశాకే తనకు ఇవ్వబడ్డ లెక్కను కూడా పరిష్కరించలేకపోతాడు .కానీ ఆ లెక్కకు సమాధానం తనకు కొట్టిన పిండి అన్నట్లు వ్యవహరిస్తాడు . చివరికి ఏదో ఒక సమాధానం రాసి - ఇదే కరెక్టు అని బుకాయిస్తాడు . కానీ ఆ సమాధానం ఎట్లా కరెక్టు అన్నది ప్రజలకు వివరించి చెప్పి ఒప్పించి లేక పోతాడు . తానే కరెక్ట్ అనే  బుకాయింపు మాత్రం చేస్తాడు .

యాషీ షిరూ మాత్రం అనుకున్న సమయం దాటినాక, మాత్రమే  లెక్కను పరిష్కారం చేయగలుగుతాడు .దాన్ని ప్రజలకు వివరించి చెప్పగలుగుతాడు . కానీ ఒకరకంగా చూస్తే అతడు పందెము ఒడి పోయి నందుకు వూరు ఒదిలి వెళ్ళాలి . కానీ ఊరి ప్రజలు కలుగ చేసుకొని యాషీ షిరూ ను బ్రతిమాలి తంపూరిలోనే ఉంచుకొని యామశాకే ను ఊరినుండి తరిమి వేస్తారు .

తదనంతర కాలంలో  యాషీ షిరూ వేరు వేరు గ్రంథాలనుండి సేకరించిన మరింత జటిలమైన అనేక లెక్కలను పరిష్కరించి ప్రజలకు చూపుతాడు .వారికి

నేర్పుతాడు . ప్రజలు ఆ లెక్కలను దాని జవాబును చెక్క పలక మీద చెక్కించుకొని ఆ ఊరి దేవాలయం లోని దేముని విగ్రహం పక్క నిలిపి - దానికి కూడా దేమునికి చేసిన విధంగా నమస్కారాలు చేస్తారు .

విజ్ఞ్యానం అనేది భగవంతుని తో సమానమైనది ప్రజలు తలపోశారు అనుకోవచ్చు .

పైనచెప్పిన లెక్కల పలకలు వంటివి ఆ రోజుల్లో జపాను అంతటా వున్నా అనేక దేవాలయాల్లో ఉండేవి . ఆ రకంగా విజ్ఞ్యానం ఏ ఒక్కరి సొత్తూ అయిపోకుండాను లుప్తం అయిపోకుండా ను - తరతరాలకు ఉచితంగా పంపిణీ అవుతూ ఉండేది . ఈ రకంగా బడినుండి గుడికి చేరి భద్ర పరచబడి న విజ్ఞ్యానమే నేటి జపానీయుల పురోగతికి కారణం అని నావిశ్వాసం .ఇల్లాంటిది మనకు ఉండి ఉంటే మనము ఎక్కడవుండేవారమో కదా ?? విజ్ఞ్యానము దేముడు రొండు సమము అయినప్పటికీ కూడా మనము కేవలము దేముని మాత్రమే ఆరాధిస్తూ వున్నాము .
by varanasi sree rama krishna

---

**7** పంతులుగారికి పట్టు బట్టలు - **08 -02 -24** {రొండో సారి}

మా వూరు అమరావతి . ఇది మా చిన్నప్పటి ముచ్చట . మావీధి బడి మాస్టారుగారు పేరు సొలాసా లక్ష్మీ నారాయణ గారు . అయన అప్పటికే ఎలిమెంటరీ స్కూల్ మాస్టార్ గిరీ చేసి విరమించి, వీధి పాఠ శాల నడుపుతూ -- చన్నీళ్లకు వెనీళ్ళు కలుపుకుంటూ వున్నాడు .అప్పటిలో ఐదో తరగతి పిల్లలకి నెలకి అయిదు రూపాయల ఫీజు .

మా పంతులుగారు పిల్లల కు కొన్ని తెలుగు పదాలు చెప్పి వారిచేత పలకల మీద రాయిస్తూ వున్నాడు .

"మనము ప్రతిరోజూ పప్పు తినాలంటే కందిపప్పు అవసరపడతవి . మీలోని ఆడపిల్లలు రేపు పెళ్లిళ్లు అయినాక వారి మొగుళ్ళకు కందిపప్పు- రొండు శేర్లు కావాలె "అని చీటీ రాసి ఇవ్వాల్సి వస్తుంది . అందువల్ల " కందిపప్పు రెండు శేర్లు " అనే మాటని మీ పలకల మీద రాసి చూపండి " అన్నాడు -- ఒక పక్కాగా కూచున్న ఆడపిల్లలను చూసి .

అందులో ధనలక్ష్మి అనే అమ్మాయి వుంది .ఆ అమ్మాయి గత ఐదేళ్లుగా ఇక్కడే చదువుతుండటం వల్ల - ఆ అమ్మాయి - మా బడిలో నే టాప్ క్లాస్ అయినా ఐదో తరగతిలో కి వచ్చింది . ఆ అమ్మాయి " కందు పప్పు రెండు చేరులు " అని రాసింది . మా పంతులు గారు అది చూసి వళ్ళు మరిచి ఆ అమ్మాయిని దండించి వదిలాడు . ఇది కాక " కందిపప్పు రెండు శేర్లు "

అనేమాటను పలకమీద యాభై సార్లు రాసుకురమ్మని పనిష్మెంట్ కూడా ఇచ్చాడు . ఇంత పెద్దతరగతిలో ఉన్న తనకు - చిన్న తరగతి పిల్లల ముందు ఎంతో అవమానం జరిగిందని ఆ ధనలక్ష్మి మనస్తాపంచెంది - బడి వదలగానే - ఏడ్పు ముఖంతో ఇంటికి పోయింది .

ధన లక్ష్మి తండ్రి వూర్లో కెల్లా పెద్దదైన పచారీకొట్టుకు యజమాని . పైగా బ్రతక లేని బడి పంతుళ్ళ పాలిటి కల్పవృక్షం . అడిగినదే చాలు పంతులుగార్లకి అరువు మీద సరుకులు కడతాడు . మా పంతులు గారు కూడా ఈయన పద్దులో ఉన్నవాడే . ఆ సాయంత్రం పంతులుగారు సంచీ పుచ్చుకొని శెట్టి గారి కొట్టుకు వెళ్లి " రేపు మా బావమరిది రానున్నాడు .పప్పు లేని భోజనం మా ఇళ్లల్లో మర్యాద గాదు " ఖాతాలో రాసుకొని ఒక సేరు కందిపప్పు ఇవ్వండి " అని అడిగాడు . పంతులుగారికి ఇప్పటికే కొట్లో పెద్ద అప్పు వుంది . ఇంకా అప్పు పుడుతుందో పుట్టదో అని అనుమానం వుంది . ఇదికాక శెట్టిగారు ధనలక్ష్మి జీతం కోసమని ప్రతినెలా ఐదు రూపాయలు అప్పులోనుండి తగ్గిస్తూ ఉంటాడు .

శెట్టిగారు కందిపప్పు కొలిచి పట్టుకొని " ఏందీ పంతులుగారు ? . మా అమ్మాయిని తిట్టి కొట్టారుటనే . శుక్రవారం సాయంత్రం పూట మాయింటి మా లక్ష్మి ఏడ్చుకుంటా యింటికి వస్తే మాకు ఎంత నష్టమో ఆలోచించండి? మా పిల్ల చదువుల సరస్వతి .

బాల మేధావి . పిల్ల రాసినదాంట్లో తప్పేమి వున్నదీ అండీ ? . కందులు అనేవాటినుండి వచ్చే పప్పు కాబట్టి "కందు పప్పు" అని రాసింది .అదేమన్నా తప్పా? ఎవరన్నా సరే దుకాణం వెళ్లి " సింత పండు " ఇవ్వండి అని అడిగితే "చింతపండే " ఇస్తారు . అట్లాగే " ఎవరన్నా " రొండు శేరులు బదులు " రొండు చేరులు" అని చీటీ రాసుకొచ్చినా మేము రొండుసేర్ల కందిపప్పు నే ఇస్తాము . బేరం పోగొట్టుకుంటామా ? మీకామాత్రం తెలియక పోగా .. పిల్లని కొడితిరి . అది ఏడుస్తా కూచుంది .మీరు వెళ్లి " నీ తప్పేమీ లేదమ్మా . నేనే పొరపడ్డాను " అని బుజ్జగించుకు రండి . మా పిల్ల నవ్వితేనే మీకు " కందు పప్పు ఇచ్చేది " అని చెప్పాడు .

మా పంతులు గారుఇంటిలోనికి వెళ్లి ఆపిల్లను చంకన ఎత్తుకొని తెచ్చి " బంగ్గారు తల్లీ .. బాల మేధావీ నీ తప్పేమీ లేదమ్మా కందుల్లోనుంచి వచ్చే పప్పు "కందు పప్పే " అవుతుంది. నేనే పొరపడ్డాను " అని చెప్పి ఆపిల్లను బుజ్జగించాడు . ఆపిల్ల మేధావి కనుక పంతులుగారి కందిపప్పు బాధలు అన్నీని అంతా అర్ధం చేసుకుంది . పిల్ల నవ్వులవల్ల పంతులుగారికి "కందు పప్పు' సంచిలో పడ్డవి.

ఇంతటితో ఆగలేను . మన దుకాణదారు వూరిలోకెల్లా శ్రీమంతు . వూరిలో జరిగే గుడి ఉత్సవాలలో పెట్టే హరి కధలకు బుర్ర కధలకు ఆయనే ఆర్ధిక దాత . ఒకేసారి హరి కధా గానం జరిగే టప్పుడు పంతులుగారిని వక్తగా పిలిచారు . పంతులు గారికి

ముందే కొన్ని సూచనలు అందాయి . దానిప్రకారం మా పంతులు గారు  హరికథ గానం చేసే ఆయన గురించి సభకి పరిచయం చేసి , ఆ తరువాత " మన వెంకట శెట్టిగారి కూతురు ధన లక్ష్మి .బాల మేధావి . ఆమె తెలివి నాకే అబ్బురం కలిగించినది . ఆమెకు చదవను ,    రాయను మీద ఎంతో మంచి పట్టు వున్నది .నిజం చెప్పవలనంటే.  కొన్ని మాటలు నేను  ఆమెనుండే నేర్చుకున్నానని చెప్పవలసి  వుండే . మీరంతా అంటే మనమంతా ఇది  గమనించాలె. ఇప్పుడు ఆమెచే ఒక ప్రార్ధ్నా  శ్లోకం  " అని ప్రకటించాడు  . మా మాస్టారు గారు స్వామి   భక్తి కొద్దీ, లేదా అప్పు భయం కొద్దీ  చెప్పమన్న దానికన్నా ఎక్కువే చెప్పివున్నాడు అనుకోవాలె . ఇట్లాగా అయన అనేక సందర్భాలలో చెప్పవలిసి వచ్చినది . చేసినాడు కూడాను .

అనేక సభలో మా మాస్టారు చెప్పగా చెప్పగా - ఆమె వేదికలెక్కి ప్రార్ధనా శ్లోకాలు చదివి చదివి -  చివరికి ఐదో తరగతి ని గొప్ప గా చదువుకున్న పిల్లగా ధనలక్షిపేరు పొంది- వివాహ వయస్సు కు వచ్చి  నిలిచింది.

పిల్ప్కు  డబ్బు,తో పాటు  గురువులు మెచ్చిన చదువు కూడా మస్తుగా  వున్నదని పెద్ద పెద్ద సంభందాలు పరుగెత్తుకు వచ్చినవి .విదేశాలతో పొగాకు వ్యాపారం చేసే కోటీశ్వరుడు ఒకాయన వచ్చి ఈమీ నా కోడలు కావాల్సినదేనని పట్టు పట్టి జయించాడు .

ధనలక్ష్మి పెళ్ళిలో మా పంతులుగారికి పట్టు బట్టలు లభించినవి . ఏది ఏమైనా గానీ

మా పంతులుగారు " కంది పప్పు " అనటానికి ఇంకనూ జంకుతూనే ఉంటాడు అని నే అనుమాన పడతాను.

ఇది ఇంతకు ముందు ఎన్నడో రాసినది . నా అమరావతి కధలు చాలా మంది ఇష్టపడుతూ ఉండటం వాళ్ళ కొన్ని తప్పులు సరిదిద్ది కొన్ని మాటల ను మాత్రమే చేర్చి రాసాను అని తెలియ పరుచుకుంటున్నాను - ఇట్లు వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

.—---------------------------------------------------

## 8 - బ్రేక్ అప్ 31-12-22

అమ్మాయి కాలేజీ కి వేడుతూ లంచి బాక్స్ సర్దుకుంటున్నది .
కూర పెట్టుకునే చిన్న గిన్నిలోనేమో అన్నం పెట్టుకుంది . అన్నం పెట్టుకునే పెద్ద గిన్నిలోనేమో పచ్చడి పెట్టుకుంది . ఇదంతా వాళ్ళ అమ్మ చూస్తూనే వుంది
" ఏమిటే ? గంటె అన్నానికి ఆరు గంటెల ఆవకాయ పచ్చడి వేసుకున్నావు ' అని అడిగింది.

" ఇవాళ నా బాయ్ ఫ్రెండ్ తో నాకు బ్రేకప్ ఉందమ్మా .. వాడిమొహన కొడదామని " అని అన్నది కూతురు .

" మొత్తం ఎన్ని బ్రేకప్ లే ? మొన్న టమోటా పచ్చడి సీసా , అటు మొన్న చింతకాయ పచ్చడి సీసా , నిన్న పండుమిర్చి పచ్చడి సీసా సగం సగం ఖాళీ అయ్యాయి . దీనితో ఆఖరా ఇంకేమన్నా ఉన్నాయా ? అని అడిగింది తల్లి .

" నిమ్మకాయ పచ్చడి అవసరం కూడా ఉందమ్మా " అంది కూతురు.

---

## 9- పెద్ద పట్టే పట్టాడు... 30-12-22.

జోగినాధం గారు కాళ్ళు ఈడ్చుకుంటూనూ ఉసూరు మంటూనూ " దైవ విజ్ఞ్యాన జ్యోతీష మహా ఋషిపీఠం " అని రాసి వున్న ఇంటిలోనికి వచ్చాడు . జోగి నాదం గారికి ఒక అబ్బాయి ఒక అమ్మాయి పెళ్ళికి వున్నారు . జ్యోతీష పీఠం నాయన గురు గారు అదీ ఇదీ అనీ ..ఎదో తన సొంత లాభం కోసం అవీ ఇవీ చెప్పి - ఏ ఒక్కరికీ పెళ్లి అనేది జరక్కుండా చూస్తున్నాడు - గ్రహాలు అంత స్పష్టంగా చెపుతున్నప్పుడు - నేను వున్నది ఉన్నట్లు చెప్పక తప్పదు అని కూడా ముక్తాయింపు ఇస్తున్నాడు .

స్వయంగా అయన కొడుకులే పెళ్లిళ్లు కాకుండా నిల్వవున్నారు. దాన్ని గురించి అయన చేసింది ఏమిలేదు .

కొంత మందికి కాఫీలో ఘూడత పెరిగినకొద్దీ - కాఫీ మజా ఇస్తుంది . మరికొందరికి కూరలో మసాలా ప్లస్ ఉప్పు , పడినకొద్దీ మజాకా వస్తుంది .ఆ మజాలో చివరికి మనిషే మూలపడతాడు . జాతకాలు చూపించుకునే వారి పరిస్థితి కూడా ఇలాగే ఉంటుంది .ఆ మజాలో పది చివరికి పిల్లలని నలభై దాటించేస్తారు . వీరికి గ్రహాలను శోధించి ఎదో కనుక్కోవాలని, ఇంకా ఎదో మరింత స్పష్టంగా వినాలని, భవిష్యత్తును చూడాలని- కోరిక ముదిరి - అదే గ్రహ పిచ్చి అవుతుంది . ,చెప్పేవారికి కూడా అంతే .

వంట మేస్త్రి వంటివారు. కొత్త మసాలాలు ప్లస్ అదనపు ఉప్పు కలిపి వండి వడ్డించి "మీ మాటల వంటకాలు సెహబాష్ అని అని పించుకోవాలన్న కుతి ముదురుగా ఉంటుంది .

విన్న వారినుండి నమస్కారాలు - దక్షిణలు రాబట్టి తన ప్రయోజకత్వాన్ని నిరూపించుకోవలన్న దురద ఎక్కువవుతుంది పీఠం నాయనలకు .

జోగినాథంగారు ఉసూరు మంటూ నిరాశగా లోనికి రావటం , పీఠం నాయన కనిపెట్టాడు . ఈ పిట్ట చేజారిపోతే గుడ్డు

లేదా ఫుడ్డుకు కష్టం అవుతుంది , అందువల్ల  ఈ పిట్టఎగిరి పోకుండా ఏదన్న  కొత్త  ఆకర్షణలో పడేయాలి అనుకున్నాడు.

జోగినాధం గారు కూచోగానే పీఠం నాయన ఇట్లా అన్నాడు " మీకోసం అని వేదం జోస్యం ఖగోళం చెరక సంహిత వంటి గ్రంధాలుఎన్నో  పరిశీలించాను . " గ్రహాల దేముంది ? గ్రహాలు అనుకూలించకపోతే ఏమైపోయింది  . దేముళ్ళు వున్నారుగా?  వారే ముఖ్యం,"   అని ఒక జోస్య గ్రంధంలో రాసి పెట్టారు . దాని ప్రకారం " ప్రతి వత్సరం -ఫదో నెల దశమి నాడు ఏకాదశి ఘడియలప్పుడు పార్వతీ పరమేశ్వరులు ముచ్చట్లకు కూచుంటారు .శివుడు ఆధాట్టుగా ఒకబ్బాయి పేరు చదివితే - అమ్మవారు ఒక అమ్మాయి పేరు చదువుతుంది . ఇహ అంతే - ఆ అమ్మాయికి అబ్బాయికి వివాహం నిశ్చయం అయిపోయినట్లే.

పెళ్లిళ్లలో గ్రహాలు అడ్డుపడ్డ నిర్భాగ్యులను బ్రోచటానికి అని ఆ  ఆది దంపతులు ఈ ముచ్చట్లు పెట్టుకుంటారు . "మనము అసలు పనులు మాని ఈవేరే పనులలో పడితే లోకం ఏమవుతుందో" అనుకుంటూ  వారు ఒక్క ఫది నిమిషాలకు మించి ఈ ముచ్చట్లు పెట్టుకోరు  .  మీ అబ్బాయి పేరేమో యాదగిరి . అమ్మాయి పేరేమో

యామిని . ఆ అనే అక్షరంతో మామొదలెట్టిన లిస్టులోమీ పిల్లల పేరు ఎక్కడనో అడుక్కి ఉంటుంది . యా అనే అక్షరం వచ్చేసరికి ఎంత సమయం పడుతుందో ఎవరం చెప్పలేము . మీ పిల్లల పేర్లేమో లిస్టులో అట్టడుగున వున్నాయి .అందుకని - మీ పిల్లల పేర్లు "ఈద్గిరి" అని ఈమని అని మార్చి , వినాయకుడిని, మంచి చేసుకొని– పేర్ల లిస్టులో మీ పిల్లల పేర్లు ముందు కి అంటే, లిస్టులోపైకిచేర్పిద్దాము .అంటే ఆ ఆ ల తరువాత వచ్చేట్లు చూద్దాము . ఈ లిస్ట్ తయారీ చేసేది గణపతి ఏ నని రూఢీగా తెలిసింది . అందువల్ల మనము "మహాగణపతీ సిద్ధ ఆనంద సిద్ధి మహా హోమము చేద్దాము. అదే మంచిది అని తోస్తోంది" అన్నాడు .

"అంత గొప్ప వారు కలుగ చేసుకొని మన పిల్లల పెళ్ళికి పూనుకుంటే ఇంకా మనకి కావాల్సింది ఏమిటట ? పేర్లు ముందుకి నెట్టిద్దాము వాళ్ళ భవిష్యత్తును తీర్చి దిద్దుదాము " అని ఆలోచించుకున్న జోగినాధంగారు ఎనిమిది లక్షలు ఖర్చు చేసి ఘనంగా హోమం చేసాడు . పది మంది బంధువులను పిలిచి బువ్వలు ఎట్టుకోవాలన్న కోరికనుకూడా ఇందులోనే తీర్చుకోవచ్చునని దీన్నొక ఫామిలీ ఈవెంట్ లాగా జరిపించి తరించాడు .

దీన్ని చూసి,  జోగినాధంగారు "పెద్ద పట్టే పట్టాడు" అని బంధువులు అనుకున్నారు .

by varanasi sree rama krishna

—-----------------------------------------------------------------

## 10–బట్టతల -  పొట్ట తగ్గటం  29-12-22

పెళ్లిళ్ల పెద్దయ్య గారు ఒక వరుడి తండ్రితో మాట్లాడుతూ వున్నాడు .  అయన  చెబుతున్నది ఏమిటంటే  "పిల్ల ఎత్తు అంటే యెత్తు కాదు . ఐదు ఆరు  మధ్య నుంటుంది. కళ్ళు అటొకటి ఇటొకటి ఉన్నాయంటారు . కానీ అందరికీ అట్లాగే కదా వుంటాయని అనుకోవాలి . టీవీ చూసే టప్పుడు కళ్ళు బ్రైట్ గాను మనుషులను చూసినప్పుడు  కళ్ళు డల్లుగానూ ఉంటాయి . పిల్ల నల్లని రంగు అనటానికి వీలుకాని కాని యెర్రని రంగు లో ఉంటుంది . ఒక్క సారిగా చూస్తే వొళ్ళు లావు అనిపిస్తుంది కానీ నింపాదిగా చూస్తే   సన్నపు పిల్లే అనిపిస్తుంది . పిల్ల వెంట మూడు కోట్ల ఆస్తి వస్తుంది . తండ్రి తదనంతరం ఇంకో ఆరు వస్తాయి "

వింటున్న పిల్లవాడి తల్లి అడిగింది " మీరు చెప్పింది చూస్తే ఏమీ  అంచనాకు అందటం లేదు .  .పిల్లఎంత బరువుంటుందో అదిగూడ చెప్పండి?  "అని .

" అక్కడికీ వస్తున్నా నమ్మా .. పిల్ల బరువు ముప్పై కేజీలు అనుకోవచ్చు "

అప్పుడు తల్లి ముక్కు విరిచి ఇంకా రెట్టించి " మరీ ముప్పై ఎలాగా ఉంటుందండి "అని సాగదీసుకుంటూ అడిగింది

.

ఇప్పుడు పెళ్లి పెద్దయ్య " వెనుక మూడు కోట్లు వున్నప్పుడు అంతే బరువు ఉండటంలో ఆశర్యం ఏమిటమ్మా? అన్నాడు

.

" అంతే ముప్పై కేజీలే కరెక్ట్ .. " అన్నాడు వరుని తండ్రి . ఆయన అంతటితో ఆగకుండా " అబ్బాయికి 60 % బట్ట తల 100  కేజీల బరువు వుంది. సాలుకు ముప్పై లక్షల సాఫ్ట్ వెర్ వుద్యోగం వుంది . దీన్ని బట్టి అబ్బాయికి ఎంత జుట్టు మొలిపిస్తారో ..అంతా మొలిపించి  ఎంత పొట్ట తగ్గిస్తారో అంతా తగ్గించి  ,జుట్టు ఎంత పెంచుతారో అంతా

పెంచి  ఈ సంభంధంమాకు ఖాయం చేయండి " అని కోరాడు ..

—-----------------------------------------------------

## 11–వియ్యపు రాలిపై కోపం

కూరలు అమ్మే కమలమ్మ గంప దింపుకొని బేరము చెపుతున్నది . రుక్మిణి అనే గృహిణి కూరలు నాణ్యం చూసి బేరం చేస్తూ వున్నది .

ఇంతలోనే రుక్మిణి ఇంటికి రెండు ఇళ్ల అవతల వున్నా ఇంటిలోనుండి " కమలమ్మా .. ఇప్పటికైనా వచ్చావు లే అనుకుంటూ ఉంటే , అక్కడ కూచుని కబుర్లలో పడ్డావేంటి . రా రా .. ఇక్కడి పనులెవరు చేస్తారు నీ బాబా ?.. అన్న కేకలు వినపడ్డాయి . ఆ కేకలు వేసింది రమణమ్మ .

రమణమ్మకు కమలమ్మకు వియ్యం అందుకున్న బంధంవుంది. వియ్యపురాలి హోదాలో రమణమ్మ ఎగురుతుంది . . కమలమ్మ పడుతున్నది - ఎందుకంటే ఆడపిల్లని ఇచ్చుకుంది కాబట్టి .

అసలు కథ ఏమిటంటే, పేదయింటి కమలమ్మ కూతురిని, కలవారైన రమణమ్మ కొడుకు వలిచి వివాహమాడాడు . ఆ యువ దంపతులు పట్నంలో కాపురం వుంటారు .దయతలిచి

కమలమ్మ కూతురిని తమ ఇంటి కోడలును చేసుకున్నందుకు గానూ రమణమ్మ - కమలమ్మతో తనయింటి పనులు ఆంటే ఇళ్ళు దొడ్లు ఊడవటం . అన్నం వండటం , వడ్డించటం , అంట్లు తోమటం బట్టలు ఉతికించుకోవటం వంటివి ఉచితంగా చేయించు కుంటూ ఉంటుంది . అత్తారింటి వారు కూతురిని ఏమి ఇబ్బందులు పాలు చేస్తారో నని జంకుతో కమలమ్మ కూడా రమణమ్మకు లొంగి ఉంటుంది .

కమలమ్మ కష్టజీవి. కూరలు అమ్ముకుంటూ వచ్చి వియ్యపురాలి ఇంటికి చేరి - ఆమెకు కావాల్సిన ఇంటిపనులు వంటపని వడ్డన చేసి పెడుతుంది . ఆ వియ్యపురాలు ఈమెకు భోజనం ఆఫర్ చేయకుండానే గూడ్బై చెప్పి రేపు తొందరగా రా అని హెచ్చరిస్తుంది . ఈమె తనతో తెచ్చుకున్న టిఫిన్ బాక్స్ ని ఏ చెట్టుకిందో కూచొని తిని ఇంటికి చేరుతుంది .

రుక్మిణి ఆసక్తి కొద్దీ ఇల్లా అడిగింది." నీగంపలో ఆకు కూరలతో పాటు - నొరకాయలు - పొట్లకాయలు బీరకాయలు - బెండకాయలు చూస్తూ వుంటాను . అవి ఎవరికీ అమ్మవుతున్నట్లు కనపడదు . ఏమిటి సంగతి " అని .

"మా వియ్యపురాలికి ఫ్రీగా కూరలు కూడా ఇవ్వాలని పెళ్లి షరతు ఉందమ్మా ..ఇవి ఆమెకు ఇచ్చేవే కానీ అమ్మేవి కావు " అనింది కమలమ్మ.

" చూడటానికి చాలా నెవళంగా వున్నాయి . రేటు ఇస్తాను. మాకు ఇలాంటివి మాకూ అమ్మరాదా ?" అని అడిగింది రుక్మిణి .

" ఇల్లాంటివి మీకెందుకమ్మా .. నేను కావాలని వీటికి ఎక్కువగాను అవసరాన్ని మించీ ఎరువులు , పురుగు మందులు, విష రసాయనాలు చల్లి పండిస్తాను . ఈ కాయలనిండా విషమే ఉంటుంది . వీటితో చేసిన కూరని మావియ్యపు రాలు లపక్ లపక్ మని తింటూ ఉంటే .. నేను మనసులో " ఈ విషాలు తిని తొందరలోనే కుళ్ళి కుళ్ళి చస్తుంది ముండ" అని సంతోష పడుతుంటాను . ఈరకంగా ఆమెమీద ప్రతీ కారం తీర్చుకుంటున్నాను " అన్నది కమలమ్మ .

"మరి నువ్వేమి తింటావు ? అని అడిగింది రుక్మిణి '

" నేను పాటి మట్టి మీద సేంద్రీయ ఎరువులు వేసిన కూరలు తింటాను , నేను ఆరోగ్యంగా ఉంటేనే గా ఆముండ యొక్క కుళ్లుడు చావులు చూసేది.? ఈమె అడ్డు వదిలినాక నేను నా కూతురి పంచన చేరి ఓపిగ్గా సుఖపడతాను " అంది కమలమ్మ .

---

## 12 అత్తగారికి చెత్త వైద్యం - **18-12-22**

వారిది ఒక వ్యవసాయక కుటుంబం . కోడలు పేరు కోమలి . ఒత్తి డబ్బు కాపీనం మనిషి .

కోమలి అత్తగాబు వెంకమ్మ గారు భర్త మరణించాక కూడా పొలము పాడీ చూసుకుంటూ తనభర్త ఏర్పరిచిన పెంకుటింట్లోనే ఉంటూ , కాలం వెళ్లబుచ్చుతున్నది . వెంకమ్మ కు వయసు మీద పడటం వల్ల తరచూ డాక్టర్లను చూడటం తప్పని సరి అవుతున్నది . ఒక సారి ఆమె మెడలోని గొలుసు అమ్మి కూడా వైద్యం చేయించుకోవాల్సి వచ్చింది .

ఈ నేపథ్యంలో కోమలి బాగా అలోచించి తన అత్తగారు తాను కూడపెట్టుకున్నది - ప్లస్ మామగారు వదిలి వెళ్ళినది మొత్తము వైద్యం కోసం కరిగిస్తూ ఖర్చు పెడుతూ వున్నదని - ఇట్లా అయితే మన పిల్లలకి మిగిలేది చిప్పే అని మొగుడి ముందు కన్నీరు పెట్టుకుంది .

అతడు కరిగిపోయాడు . కరిగి కారి పోవటంతో అతని తప్పు ఏమీ లేదు .కలకంఠి కన్నీరు తన పవర్ చూపింది . " నీ ఇష్టం ఏమి చేస్తావో చేయి " అని అతడు అస్త్ర సన్యాసం చేసాడు .

కోమలి పల్లెకు వెళ్లి తన అత్తగారిని తన కంట్రోల్ లోకి తీసుకుంది -అంటే ఎగిరి పోట్లాడి రచ్చ చేసి అత్తా గారి బంగారు వస్తువులు, నగదు నిల్వను తన పరం చేసుకున్నది . అత్తగారికి పైసా అందకుండా పొలం తాలూకు కవుళ్ళు అన్నీ గూడా తనకే మళ్లించుకుంది .

ఇక ముందు "పొదుపు ఫథకం ద్వారా అత్తగ్గారిని కడకంటా చూడాలని  నిర్ణయం తీసుకొని ,అత్తా గారిని ఇంటికి తెచ్చింది .

" ఆమెను అక్కడే వదిలేస్తే,  నాలుగు డబ్బులు కనపడగానే పట్నం వెళ్లి మంచి ఆస్పత్రికి వెళ్లి,  లేని జబ్బులకు వున్నా డబ్బులు ఖర్చు పెడుతోంది .వైద్యం పేరున పట్టణం వెళ్లి తిరిగి రావటం , మీఅమ్మకు అదో అలవాటు కాలక్షేపం అయి పోయింది . అదే ఆమె ఇక్కడే ఉంటే మన వీధి చివరి వున్నా చిన్న డాక్టర్ గారికి చూపిస్తాను  . ఆయన ఫీజు తక్కువ . ఎక్కువ మందులు రాయడు . మీ అమ్మ పెట్టె హాస్పిటల్ ఖర్చులో మనకు 90 % అదా . తెలిసిందా ? " అని కోమలి వాళ్ళాయనకు క్లాసు ఇచ్చింది . అతడు ఆ పాఠం బాగా వంట పట్టించుకున్నాడు .

ఇక మన కోమలి ఎంత కాపీనం మనిషో చూడండి ..

" కోడలా నాలిక పీకుతోంది .. ఆ ఆకు కూరల వాడి దెగ్గర కాస్త గోంగూర కొనమ్మా " అని అత్తగారు అడిగితే చాలు " గోంగూర ఎందుకు ? దండగండి . ఫది రూపాయలు పెట్టి కొన్నాక  ఆ గోంగూర కాడలువృధాగా  పారేయాల్సి వస్తది . అదే తోటకూర కొంటె మొత్తం కూర చేసుకోవచ్చు " అంటూ  అత్తా కోరికను , దోమను నలిపినట్లు నలిపేస్తుంది .

ఒకనాడు అత్తగారు " అమ్మా కోడలా , డాక్టర్ కి చూపించుకొని మళ్ళా మందులు రాయించుకోవాల్సిన రోజు వచ్చింది  .. హాస్పిట లు కు వెడదామా ? అని అడిగింది .

" ప్రాణాలు పోవాలంటే వూరికే పోతాయా . ఎదో రోగం ఉండొద్దా ? వీధి చివర  KHANDVALLI  డాక్టర్ గారున్నారు - అక్కడ చూపించుకోండి . ఇక్కడ డబ్బులు పంపుల్లోనుండి కారటం లేదు "

అని ఒక వంద అత్తగారి చేతిలో పెట్టింది కోమలి .

అటు వీధికి చివర ఒక చిన్న డాకర్ గారు వున్నారు . ఆయన్నందరూ పుస్తకాల డాక్టర్ అని .. లేదా "రేపురా" డాక్టర్ గారు అని అంటారు . ఈయన ఎప్పుడూ ఎదో పుస్తకాలు చదువుతూ ఉంటాడు . అవి మెడికల్ జర్నల్స్ అని ప్రజలకు గ్రహింపు లేదు .  పేషంట్ వచ్చిన చాలా సేపటికిగాని ఆయన పుస్తకం లోంచి తల తీయడు . అప్పుడు మాత్రం  పేషంట్ చెప్పినదంతా  విని " రేపురండి - ఆలోచిస్తాను " అనే వాడు . వెంటనే మందులు రాసేవాడు కాదు . అందున  ఈయనకు పెద్ద పేరు లేదు - జనం లేరు .

వెంకమ్మ గారితో కూడా డాక్టర్ గారు ఇట్లాగే ప్రవర్తించాడు . ఈమె ఓపికగా రెండో రోజు కూడా వెళ్ళింది . అయన మళ్ళా రేపురా " అన్నాడు . ఈమె మళ్ళా వెళ్ళింది .  ఈ సారి డాక్టర్ గారు యాభై ఫీజు తీసుకొని -

ఎదో ఒకటి రెండు బిళ్ళలు రాసి ఇచ్చి - మీరు ఈ సరికే వాడుతున్న బిళ్ళలు  అన్నీ అవసరం లేదు . మీ జబ్బు లక్షణాలకు ఇవి చాలు . నెలరోజులు వాడి మళ్ళా కనపడండి

అన్నాడు .  పె0కమ్మకు నెలకు మూడు వేల దాకాఅయ్యే ఖర్చు మూడు వందలకి తగ్గి పోయింది . " నెలకు 2500  మిగులు . సంవత్సరానికి 30000  మిగులు - చూసారా నాతెలివి " అని కోమలి అందరితోనీ చెప్పుకుంది .

" ఆదా సంగతి అట్లా ఉండనీ . నీకు త్వరలోనే  అత్తగారి పీడా ఒదిలి పోకపోతే నన్నడుగు - అన్నది . పొరుగింటామె ." అవును ఇది అందుకు కూడా పనికి వస్తుంది " అని కోమలి లోలోన నవ్వుకుంది  .

కాలం గడుస్తూ ఉన్నకొద్దీ కోమలి పెద్దది అంటే నలభయ్ దాటిన వనిత అయ్యింది . ఊబకాయం, నడుము నెప్పి,  ఆయాసం, ఆకలి లేకపోవటం, తింటే అరగక పోవటం వంటివి అన్నీ ఆమెకు వచ్చేసాయి . పెద్ద పెద్ద హాస్పిటల్ చుటూ తిప్పించుకుంది . నెలకు పాతిక వేల ఖర్చు తేలుతున్నది . కోమలి భర్త సణుగుడు మొదలెట్టి " నీకు నీ పుట్టినింటి వారు పసుపూ కుమలకిందపెట్టినది అమ్మికొని ఖర్చు వైద్యం గడుపుకో . వ్యాపారంలో నా పరిస్థితీ అంతంత మాత్రంగా వుంది " అని చెప్పేసాడు .

" అవును వున్నవి అమ్ముకుంటే - పెద్దతనములో ఆసరా కోసం డబ్బు ఎక్కడనుండి వస్తుంది  ?  " అని కోమలి చాలా తర్కించుకొని " మా అత్తగారిలా చెత్త వైద్యం చేయించుకొనే కర్మ నాకేమిటి ? " అని పట్టుదలతో  ఆస్తులు అమ్మి వైద్యానికి వాడుకుంటూ రాసాగింది .

ఇప్పుడు కోమలి అత్తగారి ఆరోగ్యం మెరుగ్గా వుంది . ఒక్కొక్క రోజున కోడలికంటే చురుగ్గా

ఉంటుంది . " చెత్త వైద్యం ఇప్పించినా నా అత్తా ముండా చావకుండా వుంది . నా చావే ముందొచ్చేట్లు వుంది " అని ఇరుగు పొరుగుతో వాపోయింది కోమలి .

"నేను త్వరగా చనిపోతే డబ్బు ఆదా అవుతుందా ? లక్ష్మీ దేవి దయతలిచి ఇంతకు ఇంతకు ఇవ్వాలిగానీ ? అని తనలో తానే వాదన చేసుకుంది .

చూసారా? ఈవాదనను، ఆమె అత్తకు `వర్తింప చేయలేక పోయింది .అదే కోడలు అంటే .

చిన్న చిన్నగా కోమలి యాభై ఏళ్ళు వచ్చాయి . ప్రతిదానికీ ఓ డాక్టర్ని చూడాల్సిన అవసరం ఏర్పడుతోంది . ఉన్నడబ్బు నిల్వలు తగ్గి పోతున్నాయి . చివరికి ఆమె కూడా వీధి డాక్టర్ చివరి పుస్తకాల డాక్టర్ను ఆశ్రయించాలిసి వచ్చింది .ఒకనాడు పుస్తకాల ఆమె డాక్టర్ఆ దెగ్గరికి వెళ్ళింది .

అయన " ఓ రోగీ రూపురా " అన్నాడు ఎప్పటిలాగే .

కోమలి ఆ రాత్రి టీవీ చూస్తో ఉండగా - పుస్తకాల డాక్టర్ గారి ఫోటో చూపించి ఎదో చెపుతున్నారు . ఈమె శ్రద్ధగా విన్నది ఏమిటంటే "డాక్టర్ గారు ఈ సాయంత్రం కారు యాక్సిడెంట్లో మరణించారు . అయన మృతికి అమెరికన్ ప్రెసిడెంట్ సంతాప సందేశం పంపారు . ఇప్పటిదాకా ఈ మట్టి లోని మాణిక్యం గురించి మనకెవరికీ ఏమీ తెలీదు .వీరు అనేక మెడికల్ రీసెర్చ్

గ్రంధాలు చదివి వాటిని క్రోడీకరించి - అమెరికన్ ప్రెసిడెంటుకి ఆరోగ్య సలహాలు - మందులు సూచిస్తూ వుంటారు . వీరి కుమారులు అమెరికన్ ప్రెసిడెంట్ గారి హెల్త్ టీం లో మొదటి డాక్టర్ . వీరు - క్లిష్ట పరిస్థితులలో తండ్రి నుండి సలహాలు , సూచన లు స్వీకరిస్తూ ప్రెసిడెంటుకి , కు మెరుగైన వైద్యం అందించటంలో తోడ్పడ్డారు . . ఈ తండ్రీ కొడుకుల బంధం ప్రెసిడెంట్ దృష్టికి రావటంతో - ఆయన ఈ పుస్తకాల డాక్టర్ మృతి పట్ల సంతాపం వెలిబుచ్చుతూ , తాను స్వయంగా సంతకాలు చేసిన సంతాప సందేశాలు మన ప్రాంతీయ టీ వీ చానెల్స్ కి -పంపారు"

"అయ్యో అత్తకు అందినది చెత్త వైద్యం కాదా ? " అని కోమలి ఎంతో విచారించింది . చెత్త వైద్యం వల్లనే వెంకమ్మ ఇప్పుడు ఓపిగ్గా వుంది. అవసరమైనప్పుడు కోడలు ను చేయి పట్టి లేవదీస్తూ వుంది .

a original by varanasi sree rama krishna

—-----------------------------------------------------------------------------